# శిశు ఆరోగ్య విద్యా కార్యక్రమము

## (Parent Education Programme)

**డా. కె.వి. రాఘవ రావు**

M.D., D.C.H.

ప్రొఫెసర్, విభాగాధ్యక్షుడు, పిల్లల వైద్య విభాగం,
గాంధీ ఆసుపత్రి, సికిందరాబాదు.

**డా. కర్రా రమేష్ రెడ్డి**

M.D., D.C.H., CCPN(USA) LMC (IMA)

పిల్లల వైద్య నిపుణుడు
సికిందరాబాదు

1998

శిశు ఆరోగ్య విద్యా కార్యక్రమము
ప్రథమ ముద్రణ : జూలై 1998


ముఖచిత్రం : శ్రీ సూరిబాబు

వెల.

ప్రతులు : 1000

ప్రతులకు

1. పిల్లల వైద్య విభాగం
గాంధీ ఆసుపత్రి, సికింద్రాబాదు.
నిలోఫర్ ఆసుపత్రి, హైదరాబాదు.

2. విశాలాంధ్ర అన్ని బ్రాంచీలలో

ఇందులో



ముద్రణ
శ్రీ లక్ష్మి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
ముషీరాబాద్, హైద్రాబాద్-20
ఫోన్స్ : 7639059, 3092716

# అతిసార వ్యాధి చికిత్స - నివారణ

చిన్న పిల్లలు తరచుగా అనారోగ్యానికి గురౌతూ ఉంటారు. వారికి వచ్చే వ్యాధులలో అతిసార వ్యాధి ముఖ్యమైనది.

దీనినే 'విరేచనాలు', 'బేదులు' అనే పేర్లతో వివిధ ప్రాంతాలలో వ్యవహరిస్తుంటారు.

## దేనిని అతిసార వ్యాధి అంటారు?

రోజుకు కనీసం 3 సార్లు విరేచనం నీరుగా కావడాన్ని అతిసార వ్యాధి అంటారు. సంఖ్య కన్నా ఈ మధ్య విరేచనంలో వచ్చిన మార్పు ముఖ్యం. చిన్న పిల్లలలో ఒకేసారి ఎక్కువ నీటి విరేచనమైనా అతిసార వ్యాధి క్రిందే లెక్క.

## ఏది అతిసార వ్యాధి కాదు?

- విరేచనం గట్టిగా, నీరు లేకుండా ఎక్కువ సార్లు కావడం.
- కేవలం తల్లి దగ్గర మాత్రమే పాలు త్రాగే 4-5 నెలల పిల్లలు పాలు త్రాగినన్ని సార్లు విరేచనం చేస్తారు. విరేచనం పాలు త్రాగుతున్నప్పుడు గాని లేదా త్రాగిన వెంటనే గాని కావచ్చు.

దీనిని 'గ్యాస్ట్రో కోలిక్ రిఫ్లెక్స్' అంటారు.

- శిశువు జన్మించిన 3-7 రోజుల వయస్సులో విరేచనం పలచగా అవుతుంది. దీనిని 'ట్రాన్సిషనల్ డయేరియా' అంటారు.

## వ్యాధి వ్యాప్తి :

మలంలో ఉండే సూక్ష్మ జీవులు బాక్టీరియా, వైరస్‌లు కలుషితమైన నీరు, ఆహారం ద్వారా నోటి గుండా ప్రేవులకు చేరుకొని వ్యాధిని కలిగిస్తాయి.

వ్యాధి వ్యాప్తిలో కీటకాలు, ముఖ్యంగా ఈగలు ప్రధాన పాత్ర వహిస్తాయి.

## అతిసార వ్యాధి వల్ల నష్టాలు

1. జలహీనత (డిహైడ్రేషన్)
2. ఆహార లోపాలు

## జలహీనత చిహ్నాలు :

ప్రకృతిలోని జీవులన్నింటికి నీరు అత్యవసరం. మొక్కకు నీరు సరిపోకపోతే ఎలా ఎండిపోయి మరణిస్తుందో అదే విధంగా

పిల్లలు కూడా అతిసార వ్యాధి వల్ల మొదట జలహీనతతో బలహీనమై ఆ తరువాత మరణించవచ్చు.

వ్యాధి ప్రథమ దశలో విరేచనాలు ప్రారంభం కాగానే చిరాకు పడటం, ఏడ్పు, దాహం పెరుగుతుంది.

వ్యాధి తీవ్రమౌతున్న కొద్దీ ఇతర చిహ్నాలు కనిపించడం జరుగుతుంది. ఇవన్నీ శరీరంలో నీరు, వివిధ ఖనిజ లవణాల పరిమాణం తగ్గడం వల్లనే.

వ్యాధి తీవ్ర దశలో మాడు లోపలికి వెళ్ళి, స్పందన తగ్గుతుంది. ఏడ్చినప్పుడు కన్నీరు రావడం తగ్గి, కళ్ళు ఎండిపోయి లోనికి పీక్కొని పోతాయి. నాలుక, నోటి లోపలి భాగం తడి ఆరి పోతాయి.

శరీరంలో బై-కార్బోనేట్ అనే పదార్థం తగ్గడం వల్ల శ్వాస క్రియ పెరుగు తుంది. గుండె వేగంగా కొట్టుకొంటుంది.

శరీరం ముసలి వారి వలె ముడతలు పడుతుంది. కడుపు మీద చర్మాన్ని రెండు వ్రేళ్ళ మధ్య పట్టుకొని నొక్కితే ముడతపడి విడిచి పెట్టిన తరువాత కూడ ముడత కొంతసేపు అలాగే ఉంటుంది. ఇది వ్యాధి లేని వారిలో వెంటనే యధా స్థితికి వస్తుంది.

శరీరం నుండి పొటాషియం విరేచనాలలో పోవడం వల్ల ప్రేవు పనిచేయక కడుపు ఉబ్బుతుంది. హృదయ స్పందన గతిలో మార్పు వస్తుంది.

జలహీనత పెరుగుతున్న కొద్దీ రక్త పరిమాణం తగ్గడం వల్ల నాడి బలహీనమై రక్తపు పోటు తగ్గుతుంది. కాళ్ళు, చేతులు చల్లబడి చెమట పడుతుంది. దీనినే 'షాక్' అంటారు.

రక్త పరిమాణం తగ్గడం వల్ల మూత్రం క్రమంగా తగ్గి మూత్ర పిండాలు పనిచేయకుండా పోవడం వల్ల ఫిట్స్ రావచ్చు. ఈ సమస్యను సకాలంలో సరిదిద్దకపోతే పిల్లలు మరణించవచ్చు.

శరీరంలో నీరు తగ్గడంతో రక్తం చిక్కపడి మెదడులోని సిరలలో రక్తం గడ్డకట్టడం వల్ల ఫిట్స్, స్పృహ కోల్పోవడం, మరణించవచ్చు.

రక్తంలో కాల్షియం తగ్గడం వల్ల, సోడియం తగ్గడం లేదా పెరగడం వల్ల కూడా ఫిట్స్ రావచ్చు.

## వైద్యం

అతిసార వ్యాధి వల్ల విరేచన రూపంలో శరీరం కోల్పోయే నీరు, ఖనిజ లవణాలు, బైకార్బోనేట్, ఆహార పదార్థాలను తిరిగి

సమకూర్చడమే వైద్యం ముఖ్యోద్దేశ్యం.

వ్యాధి ప్రారంభం కాగానే ఇంట్లో లభించే ద్రవ పదార్థాలతోనే వైద్యం ప్రారంభించవచ్చు. జలహీనత చిహ్నాలు కనిపించనంత వరకు ఇవి సరిపోతాయి.

ఇవి రెండు రకాలు :

1. ఆహార సంబంధమైనవి : అన్నం వార్చిన గంజి, పప్పు నీరు, ఉప్పు వేసిన చల్ల, లస్సీ, గోధుమ పాయసం, బియ్యపు పాయసం, బార్లీ గంజి, సగ్గు బియ్యం జావ, రాగి గంజి, ఆరో రూట్ పొడితో చేసిన గంజి.

2. పళ్ల రసాలు : కొబ్బరి నీరు, టొమాటో, కారట్ సూపు, నిమ్మ, నారింజ, బత్తాయి రసం, అరటి పండు, సపోట.

వీటిని ఇతర ఆహార పదార్థాలతో కలిపి ఇస్తే బాగా పనిచేస్తాయి:

వీటితో పాటు పాలు లేని పలచని టీ డికాక్షన్ ఇవ్వవచ్చు. ఈ పదార్థాలను ఓఆరెస్ పొడి ఇస్తున్నప్పుడు కూడా ఇవ్వవచ్చు.

కోక్, పెప్సి, లిమ్కా లాంటివి ఇవ్వకూడదు.

బజార్లో బండ్లపై అమ్మే ఏ పండ్ల రసం కూడా ఇవ్వరాదు.

# ఓఆరెస్

విరేచనం ద్వారా శరీరం కోల్పోయే ప్రధాన పదార్థాలను తిరిగి సమకూర్చడం కోసం ప్రత్యేకంగా తయారు చేసిన గ్లూకోజ్, లవణ మిశ్రమము ఓఆరెస్. దీనిని కనిపెట్టి 1997 నాటికి 25 సంవత్సరాలైంది. ఇప్పటి వరకు ఓఆరెస్ ఏ ఇతర మందులకన్నా ఎక్కువ ప్రాణాలను రక్షించింది.

అతిసార వ్యాధి ఉన్న దాదాపు 90% పిల్లలకు ఓఆరెస్ సరిపోతుంది. మిగితా 10% పిల్లలకు దీనితో పాటు ఇతర వైద్యం అవసరం. అతిసార వ్యాధికి కారణం ఏదైనప్పటికీ శరీరం కోల్పోయిన వాటిని తిరిగి చేకూర్చడానికి ఇదే అత్యుత్తమమైనది.

| ఓఆరెస్ లో ఏముంటుంది? | | |
|---|---|---|
| 1. | సోడియం క్లోరైడ్ | 3.5 గ్రా. |
| 2. | పొటాషియం క్లోరైడ్ | 1.5 గ్రా. |
| 3. | సోడియం సిట్రేట్ | 2.9 గ్రా. |
| 4. | డెక్స్ట్రోస్ | 20.0 గ్రా. |

## ఓఆరెస్ తయారు చేసే విధానం :

ఓఆరెస్ తయారీకి నీటిని తప్పని సరిగా మరిగించాల్సిన పని లేదు. దీనిని కలిపే ముందు చేతులు శుభ్రంగా సబ్బుతో కడుగుకోవాలి. పొడిని కొద్ది కొద్దిగా కాకుండా మొత్తం ప్యాకెట్‌ను సూచించిన నీటిలో ఒకేసారి కలపాలి. దీనివల్ల ఒకసారి చిక్కగా, ఒకసారి పలచగా కాకుండా మొత్తం సరియైన సాంద్రత కలిగిన ద్రవం తయారౌతుంది.

ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్దేశం ప్రకారం ఒక లీటర్‌కు సరిపోయేంత పొడి ఉండే ప్యాకెట్లు రూపొందించినప్పటికీ, మార్కెట్లో పిల్లల కోసం 200 మి.లీ. నీటిలో కలపటానికి ప్యాకెట్లు గూడా లభిస్తాయి.

పొడిని కలపడానికి పరిశుభ్రమైన మూతలున్న పాత్రలే ఉపయోగించాలి. ఒకసారి తయారు చేసిన ద్రవాన్ని 24 గంటల వరకు మాత్రమే ఉపయోగించి మిగిలిన దానిని తీసివేయాలి.

ఓఆరెస్ పెద్ద పిల్లలకు గ్లాసు లేదా కప్పుతో కోరినంత ఇవ్వవచ్చు. చిన్న పిల్లలకు 2-3 నిమిషాలకొకసారి చెంచాచొప్పున ఇవ్వాలి.

| ఇవ్వాల్సిన పరిమాణం | |
|---|---|
| వయస్సు | విరేచనమైన ప్రతిసారి ఇవ్వాల్సిన పరిమాణం |
| 6 నెలలకన్నా తక్కువ | 50 మి. లీ |
| 7 నె॥ - 2 సం॥ | 50-100 మి.లీ. |
| 2 సం॥ - 5 సం॥ | 100 - 200 మి.లీ. |

విరేచనాలౌతున్నప్పుడు మొదటి 4 గంటలలో ఇవ్వాల్సిన ఓఆరెస్ పరిమాణం

| వయస్సు | 4 నెలల లోపు | 4-11 నె | 12-23 నె॥ | 2-4 సం॥ | 5-14 సం॥ | 15సం॥ పైన |
|---|---|---|---|---|---|---|
| బరువు | 5 కి॥ తక్కువ | 5-7.5 | 8-10.9 | [illegible]15.9 కి | 16-29.9 | 30 కి పైన |
| మి.లీ | 200-400 | 400-600 | 600-800 | 800-1200 | 1200-2200 | 2200-4000 |

ఆసుపత్రిలో ఉంచి వైద్యం చేస్తున్న పిల్లలకు త్రాగే శక్తి రాగానే ఓఆరెస్ ఇవ్వాలి. ఇది సాధారణంగా 3-4 గం॥లో సాధ్యపడుతుంది.

ఇవ్వాల్సిన పరిమాణం. 5 మి.లీ/కిలో బరువు/గంటకు

ఓఆరెస్ ఒకేసారి ఎక్కువగా ఇస్తే కడుపు ఉబ్బి వాంతి కావచ్చు. వాంతి చేసినట్లైతే 10 నిమిషాలు ఆపి మళ్ళీ ఇవ్వాలి. వాంతులు ఎక్కువగా ఉంటే కొద్దిగా చల్లని నీరు ఇవ్వవచ్చు. ఓఆరెస్ ఏ విధంగా ఇచ్చినప్పటికీ వాంతులు తగ్గనట్లైతే పిల్లలను ఆసుపత్రిలో ఉంచి వైద్యం చేయాలి.

ఇది ఇస్తున్నప్పుడు కొందరు తల్లులు విరేచనాలు ఎక్కువౌతున్నట్లు చెప్తుంటారు. విరేచనాలు ఎక్కువ కావడానికి కారణం వ్యాధి తీవ్రత తప్ప ఓఆరెస్ కాదు. కాబట్టి దానిని ఇవ్వాల్సిందిగా వారికి పదే పదే నచ్చ చెప్పాలి. ఓఆరెస్ ఇస్తున్నప్పుడు ఇతర ఆహార పదార్థాలు కూడా ఇవ్వవచ్చు. ఓఆరెస్ ఐపోయినప్పుడు తిరిగి లభించే వరకు ఇంట్లో ఉండే ద్రవ పదార్థాలు ఇవ్వవచ్చు.

## ఆహారం

అతిసార వ్యాధి ఉన్నప్పుడు ఆహారం ఇవ్వకూడదనే అపోహ ఇప్పటికీ ప్రజలలో ఉంది. ఇది చాలా ప్రమాదకరమైన ఆలోచనా విధానం.

ఓఆరెస్ ఇస్తున్నప్పుడు, ఆసుపత్రిలో ఉంచి ఇతర వైద్యం చేస్తున్నప్పుడు కూడా ఆహారం ఇవ్వడం కొనసాగించాలి. ఆకలి తక్కువ కాబట్టి వారికి ఇష్టమైనది, సులువుగా జీర్ణయ్యేది కొద్ది కొద్దిగా ఎక్కువ సార్లు ఇవ్వాలి.

ఆహారం ఇవ్వనట్లైతే వివిధ పోషక పదార్థాల లోపాలు ఏర్పడి దీర్ఘ కాలిక వ్యాధులకు దారి తీస్తుంది.

ఓఆరెస్ ఇస్తున్నప్పుడు దానికి తోడు ఆహారం కూడా ఇచ్చినట్లైతే ఆహారంలో ఉండే అమైనో ఆసిడ్లు అనే పదార్థాల వల్ల ఓఆరెస్ బాగా వంటికి పడుతుంది.

వ్యాధి ఉన్న సమయంలో ఆకలి తక్కువగా ఉండడం వల్ల ఒకేసారి ఎక్కువగా తినరు కాబట్టి 2-3 గంటల కొకసారి పెద్దలు ఓపికతో తినిపించాలి. పై పాలు త్రాగే పిల్లలకు ఆపాలే నీరు కలపకుండా కప్పు చెంచాతో లేదా గ్లాసుతో త్రాగించాలి. సీసాతో త్రాగించరాదు.

అనారోగ్యం నుండి కోలుకొన్న తరువాత ఇంతకు ముందు కన్నా ఒకసారి ఎక్కువ ఆహారం ఇవ్వడం వల్ల కోల్పోయిన బరువు తిరిగి వస్తుంది. పిల్లలు అనారోగ్యానికి పూర్వపు బరువు

త్రి వేరుకొనే వరకు పూర్తిగా కోలుకోనట్టే.

ఆహార లోపాలు ఉన్నవారికి ఏ వ్యాధైనా తరచుగా వచ్చి, తీవ్రమై, దీర్ఘ కాలికంగా ఉండి మరణానికి దారి తీయవచ్చు.

అతిసార వ్యాధి నివారణలో పరిశుభ్రతతో **పాటు విటమిన్** ఎ, జింక్, ఇనుము లోపాలు నివారించడం కూడా చాలా ముఖ్యం.

## నివారణా చర్యలు :

1. శిశువులకు 4-6 నెలలు పూర్తిగా నిండేవరకు కేవలం తల్లి పాలు మాత్రమే తాగించాలి. తల్లి పాలలో ఉండే వివిధ పదార్థాలు అతి సార వ్యాధిని నివారిస్తాయి. అందువల్లనే మొదటి 4-6 నెలల వయస్సు పిల్లలలో అతిసార వ్యాధి అరుదు.

2. పాలు సరిపోవడం లేదని డాక్టరు సరియైన కారణాల ఆధారంగా నిర్ధారిస్తే పై పాలు నీరు కలపకుండా పరిశుభ్రమైన కప్పు చెంచాతో లేదా ఉగ్గు గిన్నెతో తాగించాలి. సీసాతో పాలు త్రాగించడం ప్రమాదాన్ని కోరితెచ్చుకోవడమే.

3. 4-6 నెలల వయస్సు తరువాత అదనపు ఆహారం

పరిశుభ్రంగా ఇవ్వాలి. పిల్లలకు ఆహారం తినిపించే ముందు, మల విసర్జన తరువాత చేతులు మోచేతుల వరకు శుభ్రంగా కడుగుకోవాలి.

4. తాజాగా వండిన ఆహారాన్నే భుజించాలి. **వండిన** ఆహారం వెంటనే తినే వీలు లేనప్పుడు మూత లుంచిన పాత్రలలో పరిశుభ్రమైన ప్రదేశంలో నిలువచేసి, తినే ముందు కొంచెం వేడి చేసి తినాలి. దుర్వాసన, చెడు రుచి ఉన్న ఆహారాన్ని తినరాదు.

5. చిన్న పిల్లలకు వ్యక్తిగత పరిశుభ్రతపై అవగాహన ఉండదు కాబట్టి పెద్దలే శ్రద్ధ తీసుకోవాలి. పిల్లలు పళ్ళు వచ్చే వయస్సులో చేతులు, ఆట వస్తువులు నోట్లో పెట్టుకొంటారు కాబట్టి 2-3 గం॥ల కొకసారి వాటిని శుభ్రంగా కడగాలి. చొళ్ళు కారి శరీరం, బట్టలు అపరిశుభ్రమౌతాయి కాబట్టి రోజుకు 2-3 సార్లు స్నానం చేయించాలి. గోళ్ళు వారానికి ఒకసారి కత్తిరించాలి. పొడవు గోళ్ళలో మట్టి చేరడం వల్ల అందులోని సూక్ష్మ జీవులు వ్యాధులను కలిగిస్తాయి.

6. ప్రయాణ సమయంలో మరిగించి చల్లార్చిన నీటినే

ఉపయోగించాలి మరిగించిన నీటిని వేడి నీటితో బాగా కడిగిన సీసాలోనే తీసుకొని వెళ్ళాలి. ప్రయాణం మధ్యలో ఇంటి నుండి తీసుకొని వెళ్ళిన ఆహారమే తినాలి. అలా వీలు లేనప్పుడు బాగా వేడిగా ఉన్న ఆహారం చల్లార్చుకొని తినాలి. లేదా గాలి దూరకుండా పాక్ చేసిన ఆహారం తినాలి. ఉదా : పళ్ళ రసాలు.

వివాహాలు, విందులు, తిరుపతి లాంటి ప్రదేశాలలో నీరు కలుషితమయ్యే అవకాశం ఎక్కువ కాబట్టి అదనపు జాగ్రత్తలు అవసరం.

7. పళ్ళు, ఫలాలు, దుంపలు శుభ్రంగా కడిగిన తరువాతే తినాలి. బండ్లపై అమ్మే కోసిన ముక్కలు, పళ్ళ రసాలు తీసుకోరాదు. ఐస్ క్రీముల తయారీకి ఉపయోగించే నీరు కలుషితమైనా అతిసార వ్యాధి రావచ్చు.

8. పరిశుభ్రమైన నీటినే త్రాగాలి. కనీసం 2 సంవత్సరాల వయస్సు వరకు పిల్లలకు వడ పోసి మరిగించి చల్లార్చిన నీటినే ఇవ్వాలి. నీరు నిలువ ఉంచే పాత్రలపై ఎల్లప్పుడు మూతలుంచి, కావలసినప్పుడు పొడవైన కాడ ఉన్న గరిటెతో గ్లాసులోకి పోసుకోవాలి. చేతులు పదే పదే నీటిలో ముంచితే

నీరు కలుషితమౌతుంది.

నీరు కాచి ఇవ్వడం వీలు కానప్పుడు 20-25 లీటర్ల నీటికి ఒక క్లోరిన్ బిళ్ళ కలిపి, కనీసం అరగంట తరువాత త్రాగడానికి ఉపయోగించాలి.

9. జలవనరులు కలుషితం కాకుండా జాగ్రత్త పడాలి. త్రాగడానికి ఉపయోగించే చెరువు, కుంటలలోకి జంతువులను రానివ్వరాదు. చేద బావులు, బోర్ల దగ్గర మురుగు నీరు నిలువకుండా చూసుకోవాలి. బావులకు చుట్టు ప్లాట్ ఫామ్, ఎత్తైన గోడ నిర్మించుకోవాలి.

10. మల విసర్జనకు మరుగుదొడ్డినే ఉపయోగించాలి. లేనట్లైతే దానిపై ఈగలు, ఇతర కీటకాలు వాలి వ్యాధులను వ్యాపింపజేస్తాయి. పిల్లలు బయట మలవిసర్జన చేస్తే దానిని వెంటనే మరుగుదొడ్డికి తరలించాలి. మనం సాధారణంగా నమ్ముతున్నట్టు పిల్లల మలం ప్రమాదరహితం కాదు.

11. వంట పాత్రలు, గ్లాసులు, ప్లేట్లు శుభ్రంగా ఉంచుకోవాలి పసి పిల్లల పాత్రలు వేడి నీటిలో మరిగించి ఉపయోగించాలి.

# జ్వరం

తలిదండ్రులు పిల్లల ఆరోగ్య విషయంలో తరచుగా ఆందోళన చెందే విషయాలలో జ్వరం ఒకటి. పెద్దలకు తల నొప్పి ఎంత తరచుగా వస్తుందో పిల్లలకు జ్వరం అంత తరచుగా వస్తుంది. ఇది ఎక్కువగా రాత్రి సమయాలలో ప్రారంభమై అప్పుడప్పుడు తలిదండ్రులను నిస్సహాయుల్ని చేస్తుంది.

పిల్లలకు వ్యాధి సోకినప్పుడు వ్యాధి కారకాలతో తలపడి తమను తాము రక్షించుకొనే ప్రయత్నంలో కనిపించే ఒక చిహ్నామే జ్వరం.

## లక్షణాలు

- జ్వరం వచ్చే ముందు నుదురు వేడెక్కి, ముఖం, కళ్ళు ఎర్రబడతాయి.
- కొన్ని సార్లు ముఖ్యంగా మలేరియా వైరల్ జ్వరాల లాంటి వాటిలో చలి, వణకడం కనిపిస్తుంది.

- మరీ చిన్న పిల్లలలో జ్వరం వచ్చినప్పుడు తల, మిగతా శరీర భాగాల కన్నా వేడిగా ఉంటుంది.
- వాతావరణం చల్లగా ఉన్నప్పుడు జ్వరంలో కూడా కాళ్ళు, చేతులు చల్లగా ఉండవచ్చు.
- తల నొప్పి, ఒళ్ళు నొప్పులు, వాంతులు రావచ్చు.

ఆరోగ్యంగా ఉండే వారి శరీర ఉష్ణోగ్రత 36.6 °C దగ్గర ఉంటుంది. కొన్ని సార్లు 36.5-37 °C వరకు కూడా హెచ్చు తగ్గులు ఉండవచ్చు ముఖ్యంగా ఆడుకొన్న తరువాత, ఏడుస్తున్నప్పుడు. ఉదయం పూట శరీర ఉష్ణోగ్రత తక్కువగా ఉంటే, మధ్యాహ్నం, సాయంకాలం సమయానికి ఎక్కువగా ఉంటుంది. వయస్సు పెరిగిన కొద్దీ ఈ హెచ్చు తగ్గులు తగ్గిపోతాయి. చలి కాలం రాత్రి సమయం, జ్వరం తగ్గిన రెండు మూడు రోజుల వరకు ఉష్ణోగ్రత శరీర మామూలు కన్నా తక్కువగా ఉండవచ్చు.

ధర్మా మీటరుతో 6 సం॥ల వరకు చంకలో, ఆ తరువాత వయస్సులో నోట్లో చూడడం వీలౌతుంది.

జ్వరం చూసే ముందు ధర్మా మీటరును కడిగి మెర్క్యురీ 36.6°C క్రిందికి వచ్చే వరకు 4-5 సార్లు విదిలించాలి.

ధర్మా మీటరు చంకలో ఉంచి **శిశువు చేయిని** శరీరానికి దగ్గరగా తెచ్చి 3-4 నిమిషాల వరకు ఉంచాలి. ఇది శరీర ఉష్ణోగ్రత కన్నా 0.5°C తక్కువగా ఉంటుంది. నోట్లో చూడాల్సి వస్తే నాలుక క్రింద 2 నిమిషాలు ధర్మా మీటరును ఉంచాలి. చూడడానికి 15 నిమిషాల ముందు చల్లని లేదా వేడి పదార్థాలు తీసుకోరాదు. జ్వరం చూస్తున్నప్పుడు నోరు మధ్యలో తెరవరాదు.

## జ్వరం తగ్గించడం :

1. స్వెట్టర్లు, తలకు క్యాప్ లాంటివి వేయరాదు. సన్నటి వదలుగా ఉండే కాటన్ బట్టలు మాత్రమే ఉంచాలి. మరీ చిన్న పిల్లలకు నాప్కిన్ సరిపోతుంది.

2. తడి గుడ్డతో శరీరమంతా తుడవాలి. ముఖ్యంగా మెడ,

చంకలు, గజ్జలలో కేవలం నుదురుపై తడిగుడ్డ వల్ల ఉపయోగం లేదు. మరీ చల్లని నీరు ఉపయోగించ రాదు. దీని వల్ల వణకడం రావచ్చు. వణకడం ఉన్నప్పుడు తడి గుడ్డతో తుడవడం ఆపి వేయాలి. తడి ఆరిన కొద్దీ తుడుస్తూ శరీర ఉష్ణోగ్రత 38°C రాగానే ఆపి వేయాలి.

3. జ్వరానికి పారసిటమాల్ మందు డాక్టరు సూచించిన మోతాదు ఇవ్వాలి. ఒక వేళ 45 నిమిషాలలో వాంతి చేస్తే మందు తిరిగి ఇవ్వాలి.

4. జ్వరంతో ఉన్న పిల్లలకు వారికి ఇష్టమైన ఆహారం ఏదైనా ఇవ్వవచ్చు. ముఖ్యంగా రాగి జావ, కొబ్బరి నీరు, పళ్ళు, ఆహారం ఆపివేస్తే ఆహార లోపాలు ఏర్పడతాయి. నీరు కూడా ఎక్కువగా ఇవ్వాలి.



# టీకాలు

"2000 సం॥ వరకు 90%పిల్లలకు టీకాలు" అనే ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్దేశించిన గమ్యాన్ని చేరడానికి ఇంకా 2 సంవత్సరాలు మాత్రమే మిగిలి ఉన్నాయి. అందుకే మనమందరం సమిష్టి కృషితో టీకాలు వేయించి భవిష్యత్‌లో అనవసర మైన బాల్య మరణాలను నివారించాలి.

## టీకాలు వేయించకుంటే ఏమవుతుంది?

ఆరోగ్య పరిరక్షణా కార్యక్రమాలలో ముఖ్యమైనది, అతి తక్కువ ఖర్చుతో సాధ్యమయ్యేది - టీకాలతో అంటు వ్యాధులను నివారించడం.

టీకాల ద్వారా నివారించగలిగే వ్యాధులలో ముఖ్యమైనవి మీసిల్స్, పోలియో, కోరింత దగ్గు, కంఠ సర్పి లేక డిఫ్తీరియా, ధనుర్వాతం, క్షయ, టైఫాయిడ్, కలరా, కుక్క కాటు వల్ల వచ్చే రేబిస్, మెదడు వాపు, హెపటైటిస్,

హిబ్ వ్యాధి.

టీకాలు వేయించనట్టయితే పైకి ఎంతో ఆరోగ్యంగా కనిపించే పిల్లలు కూడా అంటు వ్యాధులకు గురౌతారు. అందువల్ల జన్మించిన శిశువులందరికీ క్రమం తప్పకుండా టీకాలు వేయించాలి.

## టీకాల వల్ల సమస్యలు

టీకాలు అంటు వ్యాధుల నుండి రక్షణనిచ్చినప్పటికీ వాటి వల్ల అప్పుడప్పుడు చిన్న చిన్న సమస్యలు ఎదురు కావచ్చు. కాని వ్యాధి తీవ్రతతో పోల్చి చూస్తే ఇవి అంత తీవ్రమైనవి కావు.

టీకా ఇచ్చిన ప్రదేశంలో నొప్పి, వాపు, కందిపోవడం, గడ్డ కట్టడం కనిపించవచ్చు. ఇవి సామాన్యంగా డి.పి.టి. టీకాల వల్ల వస్తాయి. టీకాను కండరంలోకి లోతుగా ఇవ్వడం వల్ల వీటిని కొంత వరకు నివారించ వచ్చు. చిన్న చిన్న గడ్డలు క్రమంగా వాటంతట అవే తగ్గిపోతాయి.

## టీకాలు ఎవరికి ఇవ్వరాదు?

టీకాలు అంటు వ్యాధులను నివారించినప్పటికీ కొన్ని సందర్భాలలో వీటిని ఇవ్వరాదు. అవి

1. తీవ్రమైన అనారోగ్యంతో బాధపడుతున్న వారికి.
2. దినదినం క్షీణిస్తున్న నాడీ వ్యవస్థకు చెందిన జబ్బులున్న వారికి.
3. అంటు వ్యాధులను ఎదుర్కోలేని ప్రత్యేక వ్యాధులు (ఇమ్యునోడిఫిషియన్సి) ఉన్న వారికి టీకాలు ఇవ్వరాదు.
4. క్యాన్సర్ వ్యాధి ఉన్న వారికి.
5. ప్రెడ్నిసలోన్ గాని ఇతర కార్టికోస్టిరాయిడ్ సంబంధమైన మందులు దీర్ఘ కాలికంగా తీసుకొంటున్న వారికి అవి ఆపివేసిన 3 నెలలకు మాత్రమే టీకాలు ఇవ్వవచ్చు.
6. ఎక్స్-రే కిరణాలతో వైద్యం చేయించుకొంటున్న వారికి.

గమనిక :

1. కొద్దిపాటి జలుబు, జ్వరం, ఒకటి రెండుసార్లు విరేచనాలైనప్పటికీ టీకాలు ఇవ్వవచ్చు.

2. నెలలు నిండకుండా, నెలలు నిండినా బరువు తక్కువ ఉన్న శిశువులకు అందరివలెనే టీకాలు ఇప్పించవచ్చు.

అవసర మైనప్పుడు డి.పి.టి., పోలియో, యం.యం.ఆర్., ఒకేసారి ఇవ్వవచ్చు. హెపిటైటెస్, పోలియో, డి.పి.టి. మూడు కూడా ఒకేసారి ఇవ్వవచ్చు. రెండు టీకాలను ఒకేసారి ఇవ్వాలి లేదా రెండింటి మధ్య కనీసం నెల రోజుల వ్యవధి ఉండాలి. అంతకన్నా తక్కువ వ్యవధిలో 2 టీకాలు ఇవ్వరాదు.






# INDIAN ACADEMY OF PEDIATRICS

## TWIN CITIES BRANCH, A.P.

Executive Committee - 1998

President
**Dr. K.V. Raghava Rao**

Secretary
**Dr. S. Sanjay**

President Elect :
**Dr. G.K. Gupta**

Immediate Past President :
**Dr. T. Yadaiah**

Vice-President :
**Dr. Swapna Karani**

Treasurer :
**Dr. J. Venkateshwar Rao**

Executive Committee Members :
**Dr. P. Sudershan Reddy**
**Dr. Nitin Chandra Mathur**
**Dr. R. Veeraiah**
**Dr. Bhasker**
**Dr. Vasudev Murali**

**PARENT EDUCATION CELL**
**Committee Members**

Convener :
**Dr. K.V. Raghava Rao**

Members :
**Dr. Karra Ramesh Reddy**
**Dr. T. Yadaiah**
**Dr. S. Sanjai**
**Dr. N.C. Mathur**